# పంచవటి

( ఖండకావ్యము )

మాధవపెద్ది
బుచ్చిసుందరరామశాస్త్రి

నవ్యసాహిత్యపరిషత్తు
గుంటూరు

# పితృస్మరణ

ఎవనికి ఇలువేల్పు నవవర్ష జలధర
    శ్యామసుందరుఁడు శ్రీరామచంద్రుఁ
డెంత క్రోలినఁ దృప్తియే కొల్ప దెవనికిఁ
    దారకబ్రహ్మగాంధర్వగీతి
అఖిలాండకోటి బ్రహ్మాండ మెవ్వాని కను
    పాపలోపలి పసిపాప యయ్యెఁ
నరిగె నెవ్వఁడు చంద్రకాంతమ్ముల దినమ్ము
    రామాయణమ్ము పారాయణమున

నా యశఃకాయుఁడు పితృశంకరాభిధేయు
భవ్యమూర్తియె నా దృష్టిపథమునందు
ద్యోతిలుత దివ్యమంగళజ్యోతి యగుచుఁ
పరమపావన శీతల ప్రభలతోడ!

# కవిప్రశంస

నృత్య సరస్వతీ కటక నిక్వణముం బ్రకటించుకొంచు సా
హిత్య సరస్వతీ హృదయ మిచ్చుచు గానసరస్వతింబలెన్
సత్య పదార్థ కీర్తనము సల్పెడు మత్కవితా సరస్వతీ
నిత్యత చాలు, స్వర్గమును నీరస మీ రససిద్ధిముందటన్

మోదములోన మోదమునఁ జోదురు, ఖేదములోన ఖేదమై
పోదురు, సర్వమున్ గరగి పోవును వారలదృష్టి, వారి యా
హ్లాదవినోదముల్ కడు విలక్షణముల్, కవులన్న నిత్య సూ
ర్యోదయకాల మానససరోవరహంస లటుల్ రసప్రియుల్

మా నవఖండ మండల సమన్విత రాజ్యము కాత్మవేదమున్
మానసశాస్త్ర మన్నవె ప్రమాణము లీపరిపాలనం బొకిం
తేని యెఱుంగరాని దొక హృద్గతభాష నెకాని దాననే
కానఁగవచ్చు మా రసజగద్వ్యవహార సమస్త శాఖలున్. 3

ఖిన్నతనేని తీపి గలిగించి దరిద్రుని భాగ్యవంతునిన్
భిన్నతలేని మార్గమునఁ బెట్టు కవీశ్వరు రాజ్యమందుఁ దై
కొన్నకొలంది నెల్లరకుఁ గొల్లరసానుభవంబు, రంపు మీ
పున్నెము పండివచ్చినది భోక్తలుగండు రసజ్ఞ శేఖరుల్. 4

కవిప్రశం

ఆదిన్ మాదు రసప్రపంచము రసాలాకారతన్ జెందఁగా
స్వాధిష్ఠానముగాఁగ జెసి కవితాశాఖన్ సుధామాధురిన్
నాదంబున్ వెడలింపఁజే ప్రణవముంబంబోలి రామాయణ
ప్రాదుర్భావ వసంత కోకిలముగా వాల్మీకి సుశ్లోకియై.

కరగించున్ శిలనైన మాదు కవితాగంధర్వసంగీత కి
న్నరకంఠస్వర దేవతాహృదయసాంద గ్రాహ్యస్నోవృత్త్యా సి
ద్ధరసాస్వాదన నిత్యనూతన మహోద్యద్రాజ్యలక్ష్మీధురం
ధర విద్యాధర చక్రవర్తి యమగో! వత్తుత్రిలోకమ్మునన్.

ఆ విద్యాధరితో సువర్ణమయపీఠాసీనుఁడై యుల్ల స్వే
చ్ఛావాతావరణంపు భోజసురభూజచ్ఛాయఁ గొల్వుండనే
యూవాడే కవికాళిదాసరసరజ్యద్రాజరాజేశ్వరుం
డావాల్లభ్యరసప్రపంచములకే యైక్యానుసంధానముల్.

# రామదూత

ఇదిగో! నీవు నిమిత్తమాత్రుఁ డగుమీ, యేనే సుమీ నిర్వహిం
చెద రామాయణమున్ సమస్తమును, నీ జిహ్వాస్థలిన్ నిల్చెదన్
పద స్వగ్రామకుటీరవాసమున నర్థిన్. భావింప నేమాత్రమున్
హృదయస్వాస్థ్య మటన్నదే కుదురబో దీ పట్నవాసంబులన్

పెడకుం బట్టినబుద్ధి త్రిప్పుకొను మబ్బీ! యెవ్వఁ డే గంగలోఁ
బడ నీకేమిర! చూచుకొమ్ము శరణోపాయమ్ము! సంసారమున్
గమనన్ నే ననువాఁడ లే నటర, నీ గగ్గోలె కాని! యికం
గడికే యెక్కుఁక నీదు కైత భగవత్ కైంకర్యమౌఁగావుతన్ !

ఉదయము పార్థివంబు వలయున్, ధ్వనియించి ధ్వనించిపోవలెన్
హృదయము రామనామమున, నెల్లపుడున్ స్తుతిపారమన్నదే
యుదరనిమిత్తమై సలుపకుండ వలెన్, బరమోక్షశాంతి నె
మ్మది కవితాసమాధికి నిమగ్నముగావలయున్ గృతిక్రియన్.

అతిపరమప్రశాంతహృదయమ్మున బ్రాహ్మముహూర్తమందు ని
కృతికి నుపక్రమించుటయు జేపకడన్ విరమించుచుండుటన్
బ్రతిదినమందు నీవు పరిపాటి నొనర్చి రచించుటం దనా
హాతమునఁ గర్ణికాగ్రమున హంసను స్తంభన చేయఁగావలెన్.

అప్పుడా బ్రాహ్మముహూర్తమందు, యదిగో! యాజానకీరామచంద్ర కరి బ్రహ్మము వాయురూపిగ జగత్ సంచారముం జేసి తూరుపురేకల్ తెలవాఱు నవలె కోకిలల్ సుప్రబోధంబు ప్రాణిపయిన్ బ్రాణిపయిన్ దదీయకృపాంగం జేయుటెంతయు శ్లాఘమో!

స్థాయి పారిజాతతరుమూలమున నాకు,
హాయి రామచింతనామృతమున,
నార్తి గలిగి భక్తు లనుకొంటయే చాలు
వచ్చి గంతుమీఁద వ్రాలుచుందు.

వేయు నేటికి మా రామవిభునివంటి
శ్యామసుందరమదనమోహనుఁడు లేఁడు;
అమ్మహాదర్శవీరు నామమ్మె చాలు
త్రిభువనమ్ములు మోహాముద్రితము లగుచు.

నాకడ నీ కొంకింత యయినన్ గనవచ్చునె కోఁతిరూపు? నాయాకృతియందు దానిపోడ యైనను లేనిదె, కోఁతి నంచు వాలీకి లభింపఁ గారణము లేదు; మఱేమియు చేసె, భక్తిమై నాఁడు, రామదూత నని యే నొకలోఁక దగిల్చికొంటయే.

ఎవఁడురా కోఁతి, నే నటరా? యీశ్వర తేజమునన్ జనించి, విష్ణువె హృదయంబుగాఁ గల మనోజవమారుతతుల్యవేగుడన్, నవమదనాభిరాముఁడను, నవ్వగుఁ జిన్న కొలందిఁ, గోఁతి నే ముఖనెడ నాడు పేర కెటు లయ్యెను సుందరకాండ మట్టులన్?

స్వాదుఫలాఫలంబులను స్వచ్ఛము లైన జలంబులన్ మితా
స్వాదన చేసి చేసి తుది వాయువె భక్షణముం బొనర్చి వ్యా
సాదులు మున్ను హంసగమనాగమనమ్ము లెఱింగి యింద్రియా
స్వాద మడంచియే కవనమార్గముఁ బట్టిరి హా కుమారకా! ॥౬

నాదసుధన్ గ్రమోపశమనమ్మయి పోయినయట్టి శ్రుత్రిపా
నాదలతో శతాబ్దులు, శతాబ్దులు యోగసమాధి నుండి, ము
న్యాదిఋషీశ్వరుల్ ప్రకృతి కావల నిల్చి, త్రికాలవేదులై
యేది ధ్వనింపఁ జేసిరది యీశ్వరవాణి సుమా కుమారకా! ॥

స్థాయి గమర్చుకొమ్ము త్రయసంధ్యలలో దినమున్ దినమ్ము గం
గాయమునాసరస్వతుల గానసుధారసధారచేఁ, బ్రతి
స్నాయువు నంటిపట్టు మలినమ్ములఁ క్షాళనఁ జేసికొమ్ము రా
మాయణనిర్వికల్పకసమాధికి, నే సమయమ్ముఁ జూచెదన్. ॥

ఈ మహనీయయత్నము ఫలింపఁగ, సర్వసుపర్వమౌళిమా
లామణిచక్రచుంబితము, లక్ష్మణదేవసమేతజానకీ
రామపదాబ్జపావనపరాగము మౌళి నలంకరించి, నీ
వీమెయి మౌనముద్ర వహియింపుమిదే నిను నావహించెదన్

పావన మా సహస్రదళపద్మసువర్ణమయాలయంబులో
శ్రీవరుఁ డైన రాఘవుఁడు, చిన్మయుఁడై వెలుగొందుచున్న నీ
జీవనపుణ్యతీర్థమున శీఘ్రమె క్రుంకిడి దాటిపొమ్ము, మా
యావరణమ్ము, నామకుసుమార్చనవేళ యతిక్రమించెదన్. ॥౧౦

పోతనకన్నఁ బండితకవుల్ గల రెండవవా నాఁడు నేఁడు త
ద్రీతిఁ గవిత్వముల్ నడిపిరే తెలుఁగందున నెవ్వరేనియున్?
హేతువ దేమొ గుర్తెఱుఁగు మెంతటిమేటికవిత్వమేని స్వ
జ్యోతి బహిర్గతం బగుట చొప్పడకున్న నిరర్థకం బగున్.

నీ వాఘ్రాణమవో, త్వగింద్రియమవో, నేత్రంబవో జిహ్వవో
కా వన్నట్లె శ్రవణంబవేని మఱి యాకాశంబవో భూమివో
కా వట్లగ్నివయేని వాయువవుచుం గా వింక నే మౌదువో
భావింపంగద వోయి రాఘవపరబ్రహ్మైక్యసంధానతన్!

లే వచ్చోటను ద్వేషరాగములు, చెల్లే లోభమోహమ్ములున్
దావే మర్లభయా, మదమ్మునకు మాత్సర్యమ్ముకున్ ధర్మమున్
గా వర్థము కామమోక్షములునుం గా వింక నే మౌదువో
భావింపంగద వోయి రాఘవపరబ్రహ్మైక్యసంధానతన్!

లే దేమాత్రము మృత్యుశంకయుని యట్లే జాతిభేదం బనన్
గా దట్లే తలిదండ్రు లన్నదియుఁ దీరా జన్మమే వట్టిదె
నీ దన్నట్టిదె లేక, యాత్మ యొకటే, నిర్వ్యాతదీపాంకుర
ప్రాదుర్భావముఁ జెందు, రాఘవపరబ్రహ్మైక్యసంధానతన్.

# పంచవటి

ఏవియో లీలల నేల చూపెదవు మే మింకేమియుఁ గోర ము
క్కువ యేదీ యొకసారి చూపఁగదె యా గోదావరీతీరపం
చవటీపర్ణకుటీరవాసమునివేషుం జేఁ బత్నీవ్రత
స్తవనీయుం బ్రపన్నరాఘవుని సీతాలక్ష్మణోపేతునిన్!

ఎవ రా పుణ్యతపోవనాంతరములో నేకాంతవాసమ్ముగన్
లవలీపల్లవశయ్యపై? నతఁడు లీలామానుషుం డైన రా
ఘవుఁ డేనా? మఱి యెవ్వ రా పరస? సాక్షాదాదిలక్ష్మ్యంశసం
భవ యా భూసుత సీతయా? కలి మివే భక్తిప్రపూర్ణాంజలుల్!

అవ్వఁ గాంచ మన లక్ష్మణుం డెచట? శయ్యాకల్పనానంతరం
బవలం బోయెనె పత్రపుష్పఫలసూర్థంబు నే యేమి లా
యువరా లక్ష్మణ! నీకు మాట యనుకొంచుండంగనే వచ్చినాఁ
వవురా! యెన్ని ఫలంబులన్ గుసుమఁ బెట్టన్ దెచ్చియున్నావురా!

మదురంగం బండుపండ్లను మాపుమ తేపుము వెచ్చియున్న కున్
వదినకుం జేతికిచ్చెదవు, వారిది భుక్తియు నిది తృప్తియున్
క్షుధ యెటు పోయెఁ బండె రుచి మూడ పహో జలమొనిగ్రోలకే
బ్రతుకంగ నెమ్మనే పవనపారణమాత్రముతోనె లక్ష్మణా!

ఎటు శమియించుచున్నది జ్వలింపక లో జఠరాగ్ని వాయు వే
మిటో యటు భుక్తిగాఁ బరిణమించి క్షుధన్ సుధ జేయు టేమిటో
ఇటు లోచరింప శేషఫణి కే యవతారము వోటఁ జెల్లె నెం
తటి ఘనమైన దీ యఘటితఘటనాపటిమంబు లక్ష్మణా!

స్థిరతరం బైన యోగసంసిద్ధిఁ జేసి
చిత్తమే క్షీరసాగరస్థితి వహింపఁ
బాలతరగల నాలీలఁ గ్రోలు నీకు
నీఫలజలంబు లెటు రుచియించుఁ దండ్రి!

అడవిని క్రొత్తక్రొత్త లయినట్టి ఫలంబులు దెచ్చి చేతి కి
చ్చెదునపు డెల్లఁ దద్రుచివిశేషము లీ వెఱిఁగించుచుంట సా
పడి కొని తెత్తు నే ననుచు భ్రాంతి వహింపర యేని యంత ప్రే
ముడిగలయన్నయున్ వదినెముట్టును రే ఫల మొక్కఁ డేనియున్?

చూచుచునున్నయట్లు వినుచున్ వినుచున్నటు చూచు నీవు మా
చూచుచునే ఫలంబుల రుచుల్ గ్రహియింతువు ప్రాణినాల్కపై
వైచుక కాదు కేవలము నాసికి నీ విచుమాట నారికిన్
దోచదు మానుషత్వమున దోఁగిన హేతువుచేత లక్ష్మణా!

వలపున కచ్చమున్ మొగలిపంటిది నీ చెలి, నీవు భోగివం
చలముకుటాయమానుఁడవు, నైజముగా నవకామయానవో
జ్వలత క్షణక్షణంబును బొసంగుచు నాగకులమ్ము, కెట్లు రాఁ
గలిగితి చుట్టువేసుక సుఖంబుగ బ్రొద్దులు పుచ్చకుండఁగన్.

పదముల నంటి వేడెదిరి పాపము నీ వెనువెంట రాఁగ మీ
వదినెకుఁ దోడుతోడ వనవాస మొనర్చును లెమ్ము లక్ష్మణా!
ముదలయొసంగు మంచును బ్రపూజ్య సుమిత్ర యనంగ నాఁడు నీ
హృదినెఱిఁగింపవా క్షమా! హృదయ యెవ్వరి యుత్సుకంబు నామగన్.

ఎల దనువాఁడ న్నావసనివాసముకుం గొనిపోవఁగాఁ, గుతూ
హాల మది లేకనాఁ, జనకు లా గురుపాదులు పేరుఁ బెట్టి, ర్యా
గ్రిళ యని, నీ క్కనాగత మెఱింగిన యంత మహర్షి వాక్కు ని
ష్ఫల మగునే పరస్పరముఁ బాయుట తప్పనె తప్ప దెట్టులన్

జనకునియాజ్ఞచే వనికి సాఁగఁగ నుండినయట్టి నేను, నీ
జనకుని యాశయమ్మున కసమ్మతి నూను టసంగతంబు, తో
డన గొనిపోదు ప్రాణమ్మిచటన్ బడియుండు శరీరమ్మంచుఁ దె
ల్పినపయిఁ గాదె, నిన్నడుగువేయఁగ నిచ్చినదామె, లక్ష్మణా

ఎటనో యున్న దయోధ్య, యంగడు వను నీయిల్లాలు, నీవుంటివి
య్యెలవిన్ బంచవటీ శిలాతలమునం, దా నేమి యేకత్ర యు
న్నటు లేకా సతి యోగనిద్రను త్వదీయాత్మానుసంధానతన్
ఘటముల్ దూరము లైన నేమి మతు లొక్కండైన వంతప్సఖా

అణుమాత్రచ్యుతి లేని యోగమున నిత్యస్వచ్ఛ మాణిక్య ద
ర్పణమౌ నీహృదయంబులోఁ బ్రతిఫలింపన్, నీసతిన్, నీ వను
క్షణముం జూచుట లేదొ, యాయమయు నీశ్యామోర్మిరూపంబు లె
క్షణ, కై సేయదొ నీకు నామెకు వియోగంబౌట యుంకెట్టులో?

అనాఁ డొక్కొక్కయాకె చేతి కిడఁగా, న్నాయన్న, యీపర్ణశా
లానిర్మాణ మొనర్చినాఁడ, వొకవేళన్ నిద్దురం జేసి తే
యేనాఁ డెట్టినిశీథము దయినఁ దంద్రీ? లక్ష్మణా! యట్టె యా
సీనుం డయ్యెద వల్ల ప్రాంగణశిలాసింహాసనంబందునన్.

పద విశ్రాంతికి ప్రాజ్ఞపాదు లిదిగో పాషాణసింహాసనం
బె మదిఁ జూచుచునుండె నేకాంతనై, యేకాకినై, నారుహాం
డెనగా రే తెలవాలులం గునిసి వాడేలేక హాస్యంబుగా
నది శబ్దించిన వింటిఁ బాముచెప్ప లోయియా! విని విశ్రాంతా!

ఈలలితంపు దేహాలత కెండ యొకించుక సోకకుండ నే
లాలవలీలవంగలతలన్ గొని చెంతల నాటి చేతిపి
రాలను బెంచ మీనదినె రక్ష్యవిశాన మమర్చికొంటి కా
బోలు శిలావితర్దికకుఁ బొల్చిన చందనమూల మందునన్

స్వచ్ఛాకాశ గభీరపర్వతదరీ సాంద్రాటవీ నిర్ఝరీ
స్వేచ్ఛాగానపరీత మైన, ప్రకృతి స్నేహానుబంధమ్ముతో
స్వచ్ఛందానిలభుక్తితోఁ, దప మిటుల్ సాగింతువే, ప్రస్ఫుర
ల్లీచ్ఛాయాసుఖ వేదికన్, విషయనిర్లిప్తాంతరంగమ్మునన్

చందనమూలదేశమున స్వచ్ఛశిలాఫలకమ్మునందు, నా
నందతరంగముగ్ధనయనమ్ములతో, బొమ లెత్తి చూతువే
యెందుల కోయి!, మా రఘుకులేశునియానతికన్న నీకుఁ గో
రం దగినట్టి దేది, యొకరవ్వయు లేదు గదోయి, లక్ష్మణా!

అంతసమాధినిష్ఠుఁడవె యయ్యును జీమ చిటుకుమన్న గు
ర్తింతువు, విల్లు నమ్ముల ధరింతువు, భద్రము, ఘోరరాక్షసా
క్రాంతము ప్రాంతమంతయును, రక్షణభారము నీకుఁ బెట్టి, ని
శ్చింతగ నిద్రఁ జెందెదరు, సీతయు శ్రీరఘురామచంద్రుఁడున్

అమితప్రోజ్జ్వల మైన, నీయమృతదేహచ్ఛాయ యీయంధకా
రమునన్, నైతము దృక్పథంబులు, సువర్ణస్నాన మాడించెదన్
సుమనోజ్ఞం బగు నీస్వరూప మటులే చూడంగఁ జూడంగ ని
ర్నిమిషంబై నయనద్వయంబును, మనోనేత్రంబు విప్పారెడిన్.

ఏ వ్యావృత్తి యొకింత లేక, నిరతం బీదైవసృష్టిక్రియా
కావ్యగ్రంథము నే పఠించుకొనుచున్, గంభీర శైలాళి మా
నవ్యాఖ్యల్ పరికించి చూచు మునిబృందం బంతరార్థం బిటన్
సువ్యక్తంబు భవన్ముఖంబున నొనర్చున్, భాష్యకార ప్రభూ!

నీ వా యన్నయు నివ్వనిన్ వెడలినన్, మీ యశ్వినీదేవతా
లావణ్యాధిక రామణీయక తనూలాలిత్యముం గ్రోలఁగా
మీ వెంటం బడి దేహభావ మన లేమీ లేక యే, వచ్చి, మీ
భావైక్యంబునఁ జొక్కుచే యిచట జీవన్ముక్తి ఋష్యాళికిన్.

అఖిలార్థకామ సమన్వయ వ్యాపిత
పరమస్వార్థ నిర్వాహణ చణులు,
ఆలోక్యవ్యాప్తాన పిపీలికాది బహు
పర్యంత తుల్య స్వభావ రమ్యు,
లుపనిష త్పుణ్య పీయూష పాన విశేష
దినదిన నవన వోత్తేజితాత్ము,
లాజ్ఞానిరీక్షక హంసవాహన దహా
రాకాశ వీథీ విహారదృష్టు,

లత్యధిక పంచవర్షమయ ప్రఖ్యాత
చిత్రలేఖాముఖాది కాంతిక జవ దైవ
నిరత సుఖ లోల్య రతిప్రాజనియు లైన
మానులు గదయ్య! మీ శ్రోత్రమండలంబు

అత్ర్యాది సప్తమహాఋషుల్ వారెత
చ్చరణసంస్పర్శయె స్పర్శవేది
అతఁడె యాపస్తంబుఁ డావృత్తచక్షువు
కేవల బ్రహ్మపదావలంబి, బ్రహ్మ
యా నారదుఁడు తురీయాతీతుఁ డాకాశ
గమన దూరశ్రవణముల వాఁడు,
అవలి జాబాలి యత్యద్భుతావహ పర
కాయప్రవేశలాఘవము గలఁడు,
సంయములు వార లరుగ! స్వచ్ఛందమరణు
లౌటయే గాక, సశరీర మైనయట్టి
స్వర్గసుఖ ముందు రని ప్రాజ సలుపుటీరు
లోకసంగ్రహణార్థ మానైక దయఁ!

ఎట చేపక్షినిగాని యేమృగము నేని వేయకే పోఁగ
న్నటు లేచూచదయాంబురాసులు గదయ్యా! నీవు నీయన్నయే
మిటికై తాల్చెద రాశరాసనములన్ మీ రట్టు లెల్లప్పు డ
న్నటు లీఘోరవనస్థలీదనుజసంహారం బొకం డుండెగా!

పదిలము లక్ష్మణా! యిచటి పంచవటీతటి నింతదాటినన్
విసలుచు నుంచు రం దీసుక వేసిన గాల్లనియట్లు లెందుఁ ద
త్పదదళితంబు గాని దగుపట్టను వారల మనికిపట్టులన్
౨౬ నెదలదు జంతువేదియును మింలను బాఱదు పక్షిసైతమున్.

అవురా! యెంతటివింత, సాక్షాత్తుగ మాంసాహారియౌ క్రూరజం
తువునేని యిచటనాదపోమహిమ సాధుం జేసెనే కాని, దా
నవుఁడై పోయినయట్టి మానవు నొకింతన్ మార్చలేదయ్యె వా
స్తవిక స్వస్థితికన్న వచ్చునదుమంత్రం బెంత దుస్సాధమో!

మణిదీపికా స్వర్ణమందిరాంతఃపుర
స్థల హంసతూలికాతల్ప మేని,
చంద్రకాంతోపలానాసమ్మంటపమధ్య
నవరత్న సింహాసనంబు గాని,
వైదూర్య నీల గోమేధిక మరకత
విసుమ స్థాద్రుకావితతి యేని,
స్వర్ణమయజ్ఞ సేవక స్ఫటికపాత్రానిత
బహువిధ ప్రసవాసవములు గాని,
చతురుదధి మేఖలా వలయిత సమస్త
భూతధాత్రీశ్వరీ కరాంబుజము గాని,
రామువనవాస, దీక్షాధురంధరతను
నింతయు నడల్పఁజాల వయ్యెను గదయ్య

మఱపునకుఁ దెచ్చినావు లక్ష్మణకుమార!
అన్న పదినెల, కయ్యయోధ్యాపురమ్ము
నిమ్మహారణ్యమందున్న, యింద్రభోగ
మమరపదవియు, స్వర్గసౌఖ్యము ఘటించె.

ఏరో రాజ్యము నీకు నీవలయునే, యేతెమ్ము సింహాసన
శ్రీరోహిణ్యపుష్పమ్ము దేవర్షుల ధనుర్జ్యారోపితాశీవిష
క్రూరాకారశరమ్ముతో, నిలుతు నీకుం బ్రకహగ్గా నన్న నీ
తీర్థుం జూచి, జగత్త్రయం బడలిపోదే, నాఁడు, రామానుజా!

స్తనమై పోయిను, క్రోధశాంతులటులన్ సంరంభమున్ జూపి సం
యమనం, బంతటిలోఁ బొనర్చితివి రామాజ్ఞాప్రకారంబుగా,
శమితంబై జ్వలదగ్ని చందమునగా పాశ్చాత్యమౌతం బయ్యె బ్రా
ణము దక్కెంజుమి మంథరాయుతముగన్, గైకేయి కానాఁటికిన్.

గుణ మగుపడ్డ నెజమనుకొందువు, మర్గుణ మున్న నంత నై
రణ మొనరింప నేర వపరాధము దైవతపీఠినుండి ల
క్ష్మణ!, దిగకే విచారణను సల్పినచో నరజాతి భూమిపై
మనుటయె దుర్లభంబగుఁడె మారఘురాముఁడు నాఁడు, లక్ష్మణా!

హృదయము నెప్పు డూర్ధ్వమునకే పరిగించుక యీ నరత్వము
న్నది యొకలీలఁ జేయఁ దెలియంబడునే మనుజస్వభావ మ్మా
పదవిని దిగ్గకే, పతితపావనుఁడన్ బిరుదంబు రాదు, మా
నదు వొక రామచంద్రుని కె నర్వము హృద్గతమౌను, లక్ష్మణా!

పరులకె కాని దైవ మనుభావమ్ము మా రఘురామమూర్తికే
నరుఁడ నటన్న భావమె మనంబున నయ్యభిమాన ముంటనే
నరున కుదారజీవనఘనత్వము నంత యనుగ్రహించెఁ దా
నెఱుఁగునె దైవమేని మును పెన్నడు నట్టికృపాసహిష్ణుతల్.

ఎపు డొకలేసుఖంబయి యొకించుక కావలెనన్నఁ గూడఁ గ
ష్టపురుచి యున్నదే పడయఁ జాలని దైవతకోటికన్న నె
ల్లపు డొకదాని నొక్కటిగ నంటుక వచ్చుచుఁబోవు కష్టసౌ
ఖ్యపుఁగలగల్పు గల్గు నరు లన్ననె ప్రీతి జనించు లక్ష్మణా!

కన్నెలు కన్నెలే యగుచుఁ గల్పము లేగిఁగాని తల్లులౌ
టన్నది లేని లేనియపు డందఱు నొక్కఁడె గాని పెద్దఁ బిం
బిన్న లటంచు లేనపుడు బింబముకుం బ్రతిబింబ మౌచు లే
కున్నపు డింక స్వర్గ మదియుండియు నేమిఫలమ్ము లక్ష్మణా!

పరుఁడే యాభరతుండు నీయటులనే ప్రాణాధికుండైన సో
దరుఁడే కా రఘురామచంద్రుల కెటుల్ దండెత్తినాఁ డంచు ను
ద్ధురతం జూపితి వల్లనాఁ డెఱుక లేదో సకవాహామాత్ర మ
త్తెఱ గెల్లన్ భవదీయ భక్తిగరిమోద్రేకంబె సూచించెడిన్.

నీదియ కాదె రాజ్య మది నే నెటు లేలుదు నకుఁగాను నీ
పాదుకలే యనన్ భరతుభక్తికినై రఘురాముఁ డంతొ యా
మోదముఁ జెంద ఖేదమును బొందెద నగ్రజప్రేమ యింకనే
సోదరుఁడేని నీయటులఁ జూరగొనందగఁడేమి లక్ష్మణా!

అడవికిఁ బోఁబోదో యెఱుఁగదె యా సవతిమ్మ యయోధ్యనుండియా
పడసెడి రాజభోగ మెడఁబాపి భళీ! భరతా! యిఁకేమికుం
గొడదువె గానఁ బాదుకలఁ గూడ హరించితివిప్పుడీ నెపం
బిడి యనునంతదాఁ గరిగె నేలొకొ నీహృదయంబు లక్ష్మణా!

ఉదయము నిత్య మీవు శిరసొగ్గెడి పాదుకలాట చేత నీ
మది కవి యన్నఁజాల నభిమానమె యందులకే నటయ్య యీ
వ్యథ తిరుగన్ రచించుకొనవచ్చును భాగ్యమె లేక బంగరో
కొదవమొయియ్యరణ్యమునఁ గొయ్యమునుం గొణతంబు లక్ష్మణా

తొడిగెడు రామపాదుకలఁ దోడ్కొనిపోవుచు నీకు మాఱుగా
నిడిరెవ రాజ్యపీఠి ననఁడే భరతుం డిఁక వీని నింతతో
విడిచితి నే ననండె రఘువీరుఁడు దాఁ దిరుగాడు చెట్టులో
పుడమి గిడరాని కంటకసమూహముల మిప్పనమంచుఁ గుందితే?

అవి చన నేమిలే తిరుగ నట్టివి వేఱె ధరింపఁబోఁడె రా
ముపుఁ డని లోన నెంచు నవకాశమె లేనటు పల్కి రాజగా
రవ మిడి యల్లపాదుకల రాముఁడు డిడెన్ దనమాఱుఁగాఁగ న
య్యవియును రామునిం బలెనె యప్రతిమానములొక్కొ లక్ష్మణా!

మొదలే తల్లికి వెన్కఁ జల్లిగడ వ్యామోహంబునన్ జూచుకొ
న్నదిగాఁ గన్నులఁ గన్నబిడ్డలుగ బాల్యంబాదిగా నెన్నఁడే
నెదురే పల్కనివారుగా భరతుఁడీ లేకంబెకా యేమి యా
డెదవో లక్ష్మణ! కారణార్థమిటులుండెన్ గైకమూకంబుగన్.

ఎక్కడికి నక్కడికె సరిలేమ టంచు
నొచ్చుకొని యెంత మనసు కుదుర్చుకొన్న
నడవి యనినప్పు డడవియే యగును గాని
యొక్కనాఁటికినేని యయోధ్య గాదు.

సమశీతోష్ణసుఖప్రదంబు బహుసస్యశ్యామలంబుఁ ఫల
ద్రుమసంశోభిత మైన కోసలమునందుఁ సర్వసంపత్సమృ
ద్ధమయోధ్యాపుర మొప్పదే ప్రకృతికాంతాగర్భశుక్త్యుత్తమో
త్తమముక్తాఫలవైఖరిఁ ధళధళోద్యత్సౌధపారంపరిఁ.

వివిధపుష్పోద్యాన విశ్రాంతి వేదికా
        సుఖవాయుసేవనోత్సుక జనమ్ము
నవనవోన్మేష సౌందర్యలక్ష్మీ రత్న
        దర్పణోపమిత రథ్యాతలమ్ము
జనపదాగత ధాన్యసంచయ క్రయ వస్తు
        సముదాయవిక్రయ సామరవము
తత్తత్ప్రదేశ నూతననిత్యనిర్మిత
        లీలానివాస కేళీవనమ్ము

సకలరాజకీయసంస్థా వ్యవస్థాధి
కారివర్గ ముఖ్యకార్యనిలయ
శతశతాధికమ్ము సాకేతనగరమ్ము
స్మృతిపథమ్ముఁ బాయు నెటుక్షణమ్ము.

సరయూమాతృక్షీరము
మఱువ దమోఘ్యాప్రరీతిమహాసిక వృద్ధిం
బొరసియు నెప్పటి కప్పుడే
చిరమూతిన హైనయట్టి శిశుసస్మితమై

పరిసరోద్యానములలోఁ బ్రభాతములను
వివిధపుష్పోపచయము. గ వించుపుష్ప
లావికాగీతికలకుఁ దాళములు వేయుఁ
దన్నది సదా తరంగహస్తములతోడ

తటము నెటు చూడ ప్రాంతకాంతారవాసి,
పరమనిష్ఠాగరిష్ఠతపస్వి వాద
చిహ్నముద్రిత మెందు దర్శించినారి
లీర లటువంటి పుణ్యవాహినిని దిరిగి

నడికిరేయి జలక్రీడ నడిపిపోవు
నప్సరోజన దివ్యదేహములనుండి
లులిత మగుచుంటఁ దన్నదీజలము సతము
లలితలలితంబు లాలితలాలితంబు.

ఆయెడ ఘట్టఘట్టవివిధాసనపాళి నిషణ్ణులై త్రయీ
గాయనగాయసీమణులు గాన మొనర్చుచు నుండరే యుప
న్యాయములందుఁ బ్రత్యుపనిషత్తును గేయముఁగా నొనర్చి స్వ
ర్గీయపదాతిశాయి యయి కేవలబ్రహ్మపదమ్ము నంటగన్.

ఆముఖ బ్రహ్మతేజము సహస్రముఖంబులఁ గామధేనుచిం
తామణులట్లు శిష్యసముదాయము కాఁకలి దప్పి తీర్ప బో
ధామృత మిచ్చుచుండిరి మహామహితాత్ములా వాలిచంద్రులం
దేమి వచింపనుండినను నీశ్వరవాణి ప్రతిధ్వనింపఁగన్.

ప్రాశన కిన్నియంబువులు పర్ణములున్ ఫలముల్ గదా తప
రాసులు బ్రహ్మవాదులు పరాశరముఖ్యఋషీంద్రు లీశ్వరా
దేశ మభిస్వరింపరె శ్రుతిస్మృతిరూపము గాఁగ మేఘ గ
ర్జాశతముక్తకంఠముల సర్వము యోగబలమ్మె వారికిన్.

ఫలమె భుక్తికి నటు గాని పత్రమందు
నట్టి దేదో యపక్వపదార్థ మంతె
యన్యజనమున కే నవధాన్యములను
నేల నెవరేని దున్ని పండించు టెల్ల

అతిథిపూజాపరాయణు లర్చ్యమాన
హరిహరపితామహులు పురుషార్థపరులు
బ్రహ్మతేజఃప్రపూర్ణులై పరిఢవిలరె
యజ్వ లప్పురిఁ బ్రజ్వలితాగ్నులట్లు.

సరయూతీర శిరీషపుష్పవన సంచారం బయోధ్యాపురీ
సురుచిత్వానుభవంబులో మఱపువచ్చున్ వచ్చినం గాని త
త్పరమామ్నాయ పవిత్ర శీతల వచోధారాభిషేకమ్ముఁ ద
త్పురవాసి ప్రబలానురాగము నొకప్డున్ జ్ఞప్తికిన్ దక్కునే.

మిన్నుక మన్నను గానరానియటు గ్రమ్మెన్ జిమ్మచీకట్లు నా
యన్నా! లక్ష్మణ రాక్షసాకులము ఘోరారణ్యమేగాక యీ
సన్నంబైనది కాళరాత్రియును బాషాణంబునం దొంటినే
యున్నావా? యటు పర్ణశాలఁ జొరరాదో నీవ్రతంబొప్పదో

అవిగో ఘోరతరార్భటుల్ వినుట లేదా? విన్ననేమాయె నం
టవు గాఁబోలును నీమనంబునకు ధ్యానంబందె యున్నావు దా
నవు లేరే నిలుప్రక్కగా మెదిలినంతన్ జేత విల్లందుకొం
దువుగా లక్ష్మణ! డించి వేతుగద చిన్మ్రిద్రన్ సమున్నిద్రతన్

అటులన్ జూచిన నెంత ఘోరము మనుష్యవ్రాతముంబట్టి తం
పటలం బెట్టుచునున్నవా రసురు లీప్రాంతంబునంగూడ నెం
తటిదుర్గంధమొ చుట్టవేసినది నీ నాసాపుటంబందె చొ
చ్చుట లేకున్నదొ రాముఁ డాజ్ఞ యిడ కచ్చో నీవు పోనేరవో.

ఆ ముని పాప మెవ్వఁడొ కదా! యటు పట్టుక యంటఁదీతు రే
చీమలమట్టి కింకఁబయిఁ జెండుటయా యొడలెల్ల వాఱలే
గా మఱినెత్రు భైరవులు గ్రమ్ముచునున్నవి కళ్ళు వానియం
దేమియు లేదు దోసమని యీశ్వరచింత యొకండు దక్కఁగన్.

ఎవఁడొ రక్కసుఁ డేదొ వచించుచుండె
ఖరునితోడుతఁ దోడిరక్కసులు వినఁగ
వింద మొకవేళ మీర లీ విపినమునకు
వచ్చు టాదిగ నడచినవార్త లేమొ.

నరు లోకమువ్వారిమునవనంబులు జొచ్చి స్వకీయ పుష్టి లే
ర్పఱచుక పర్ణశాల నదె పంచవటిన్ నివసించుచున్న వా
రిరువురు వారిలోఁ బురుషు లింతి యొకర్తుక యెల్లవెంట నొ
కరు విడనింక నొకరుగఁగాచుచునుందురు వారలాయుధుల్.

ఎటఁ బొడగట్టువారి నలనే పుటమార్పు వ్రతంబు గొన్నవా
రట! యిటువంటిపాముపగ రాక్షసు లన్నని గాని బాధనొం
దుట సహియింపనోపరట దోమయుఁ జీమయు నేని'యబ్బ!'యి
య్యటవివి నేఁటికిన్ వెలసి రన్నయుఁదమ్ముఁడురామలక్ష్మణుల్.

నరులన ద్వేషభావముననా వధియించుట పాపపొట్ట కీ
శ్వరుఁ డటుపెట్టెగా మనకు భక్షణ చేయనె చేయరేగదా
పోరిగొన నేటికో మనల బుద్ధిగలార మటంచుఁ జాటుకొం
దురు నరు లంతకంతకు నధోగతిలోఁ బడిపోవుచుండియున్.

పసులవిధమ్ములన్ దనుజభక్షణ కేర్పడువారికిన్ దపో
భ్యసనము వ్యర్థ మంచుఁ గద భంగమొనర్తుము దానదైవ వి
శ్వసనము రె దటంద్రు మునిశాలిను లట్టులైయున నేటికీ
యసురుల కొంకలాంకనె శివాలయముల్ నవలక్షకోటిగన్.

మృగముల్ పక్షులు మీను మాకెటులనో మీరేని మాకట్టులే
భగవన్నిర్ణయ మన్నఁగాని మది కే పట్టించుకోజూరనా
దిగ నీవచ్చె యిదారి కష్టపడి ప్రేమింపంగఁ బై వత్తురీ
విగ నెట్లీ మఱుపద్రవం బడచి స్వామీ! మమ్ము రక్షించెదో.

పొడిచినది చుక్క చీకటు
లడఁగెడి దూరుపదె తెల్లనాయెను జెవులం
దొప్పుచుండె విహగరుతములు
గుడి వైతాళికుల మేలుకొలుపులు వోలెన్.

ఎదురెదురన్ ధ్వనించు సెలయేటికి నావలికొండ సోల్పునం
దుదయముపక్షి ఱెక్కలటులూగుచు వాలుచు నొయ్యనొయ్యలో
నొదుగుచుదూరదూర మగుచుండెడి నీడలఁ జూచియున్నయుచ్
వదినెయు నీవు సూర్యభగవానున కర్ఘ్యము లీయవత్తురే.

ఎవ కెవరిఁ గూర్చి శోకిలె
దప్ప స్వామీ యవిగో! యశ్రుధారలఁ జారల్
మిన్నుల మలినమ్ము లొసఁగెది
నవి శుద్ధసువర్ణదర్పణకపోలములన్.

మతిఁ బుత్రవిరహహేతుక
పితృమృతియే గాక దుఃఖపీడితజీవ
న్మృతమాతృశోచనీయ
స్థితియుఁ గలఁగించుచున్నదే సౌమిత్రీ!

ఆస్వస్థానమునందు నున్నయెడ జ్యోత్స్నాపూర్ణమారాత్రు సె
ట్లాస్వాదింతొ ప్రియాద్వితీయుఁడన గా నారామదేశమ్మునన్
నాస్వామీ! యెటువంటి రేయి యెటుఁగాన్యప్రాయమైపోయె స
ర్వస్వమ్మేకతపోవ్రతమ్మున కె ధారన్ బోసికొంటే ప్రభూ!

ఇయుద్యానసరోజలాంతరితతీరానేకభూమీరుహ
చ్ఛాయాదృశ్యసహోత్సుక ప్రియసఖీసంయుక్తనాకాపిహా
రాయత్తంబులు పూర్ణిమానిశలు వాయంబోవు చిత్రంబెటుల్
స్వాయత్తీకృత మైన నాయనుభవం బాలాటి దేనాటికిన్.

కడచెన్ బూవులపందుగుంబలె నదో కాలం బదో జీవితం
బెడ మైపోయెడి నాఁడునాఁటి కకటా! యింతేనిసంబంధ మే
ర్పడకే చెప్పకచుండె సుందరదివారాత్రంబు లెన్నెన్నొ యి
కఁడదీక్షావిధి యిట్టి వింకఁ బడునాల్గా హా! వసంతర్తువుల్.

చూడన్ లేమిర తంత్రీవల్కలమటుల్ చుట్టంగఁ గంజూవులే
నీడల్ వాడెడిమేని కొత్తిడి యొకన్ నీ రాసు మాసందెవ్రే
లాడన్ జొచ్చె నవేమి టోయి! తలనీలాలన్ జడల్ గూడ నా
వీడన్ రానొకొ నిన్నివ్రతసమాప్తిన్ జేయు పర్యంతమున్.

ఇది పీతాంబరమా మరే దయివఁ గానీ హేమచేలంబ నీ
మది కెట్లొప్పెనొ యెన్నియెన్నొ జనకక్ష్మాజాని యెన్నోన్నతే
గద మాస్వామికిఁ గట్టబెట్టెమధుపర్కంబుల్ మహార్ఘంబులన్
దుడకున్ వల్కలమా వ్రతంబ కరుణాదూరంబ ధర్మంబటే.

కన్నన్ నీ కిఁడువేళ నాజనకుఁడే గర్వాతిపీరత్స్రువన్
బన్నిటన్ గడిగించుకొన్నయవి యా బంగారుపాదమ్ము లీ
కన్నిటన్ గడుగంగఁ జాల మనసొప్పఁ గవ్విప్పి తెమ్ముమ్ము న
గ్నన్నయ్యా! యెపుడున్న నేగడవ ధ్యానమ్ముల్ తపోనిష్ఠలున్.

నీ వీరాసనబంధనిశ్చలత ధ్యానింపంగ ధ్యానింప ము
న్నా వెల్వడ్డవి దుఃఖబాష్పములు గా వానందబాష్పమ్ములన్
భావావిష్టత గద్గదంగాని యది నీ బ్రహ్మైక్యసంధానమా?
శ్రీవైకుంఠవిహారమా? తెలుపుమా! క్షీరాబ్ధిసంచారమా?

లోకమ్మున్ మముఁ జూచినవ్వరో నుడున్ లోలోనఁ బుష్పించెనో
యాకంఠం బడ వెల్లడింతువటరా యానందహాసమ్ము నం
తే కాదే యమృతాశ్రువుల్ గురితువే ఈపుష్పలోకమ్ముకున్
నీ కేదో పరిభాష యున్నయటులన్ మీచందమే తెల్పెలే.

పువ్వులుఁగూడ మోహపడిపోవుచు నీమెయి వ్రాలి బంగరుం
బువ్వుల పూజ గూర్చినవి పూర్ణసుధాకరుఁ డిచ్చినాఁడు నీ
కిప్పరమూర్తిమంతునకు నెప్పుడొ కప్పురపున్నివాళి నీ
నప్పెర నవ్వు దృగ్విలసనం బిఁకనైన ననుగ్రహింతువే.

ఎవరో పాపము దేవకాంత యదిగో! హేలాగతిన్ వచ్చి యా
సవిధన్ నీరవకోటిమన్మథవిలాసస్ఫూర్తిమన్మూర్తికిన్
వివశంబైనది లక్ష్మణా! యొకకృపావీచిన్ బ్రసాదించి తే
ర్చవె ధ్యానస్థితిఁ దెల్లవాఱెచి తదాశాజ్యోతి చల్లార్తువే

పున్నఁబుట్టంబుకుఁదోడు కెంజివురుసొమ్ముల్ తీవయొడ్డాణమున్
గవళింపన్ మెయిఁ బాటలాకునఁ బయంటన్ దీర్చి నీచెంగటన్
నవిలాసంబుగ నిల్చియున్నయది సాక్షాదింద్రచాపంబటుల్
శివ కన్నెత్తినఁ జాలు నింక సశరీరస్వర్గసౌఖ్యం బగున్

తెరచితి గాని కన్నులటు తీక్ష్ణములైన విలోకనమ్ములం
బఱపెద వేటి కోయి శిశుమానసమూర్తులు గారటోయి యూ
సుత లీక నందు సుందరులు శుభ్రహిమద్యుతులట్టివాగు న
వెఱుఁగనివాఁడవా? యెవర నీ వనుచుఁ గ్ నింసింపఁ జూతువా.

కను తెఱచువఱకుఁ దెఱచిన
కను తెఱచినయట్టు లుండఁగాఁ గాచుకొనెన్
కనికరము లేదె పాపము
వినుచు నేదో యాలకింపవే సుమహాత్మా

సిరి తోఁబుట్టువుగా జనించిన ఘృతాచీ నామకక్షీరసా
గర రాజేంద్రకుమారి నచ్చరను స్వర్గంగా ప్రవాహాంబుశీ
కర ముక్తాఫలమ ణ్యాయత్నకృత రంగద్రంగవల్లీ నిరం
తర సౌభాగ్యమయేంద్రనీలమణి సౌధశ్రేణికావేదికన్

పవలున్ రే యనుభేద మేర్పడక శుభ్రజ్యోత్స్నతో సర్వకా
ల వసంతోత్సవ నిత్యయావన మహోల్లాసంపు సంపద్ఘనా
బవు స్వర్గంబును పీడగావలసె నింద్రాజ్ఞన్ దలన్ దాల్చి నీ
వెవరం చింత తృణీకరించెద వటోయీ! దేవకాంతన్ వనున్.

ఆప్రాణప్రతిమా ప్రియావిరహబాధాంతంబు గావించి స్వ
ర్గప్రేమామృతధారలోన నినుఁ బర్వస్నాతుని జేసి ని
త్యప్రీతుం బొనరించుచుండు మనె నీ వా దేవతారత్నశా
ర్థ ప్రాదుర్భవ మాదిశేషునవతారంబంట వింటేం జుమీ,

నట్టువవేళయందు నను నాయొడలన్ ధరియించుకొన్న ప్రాఁ
బొట్టుము లోఁగిపాలయవిభూషలతో విటుఁ డచ్చి సన్నిధిన్
మెట్టినదానికిన్ దగిన మే లొనఁగూడెను పెం పచట్టు పి
యుట్టికృతిన్ మహేంద్రునికి నెంతటి చిన్నతనమ్ము మాచికే.

ఇది గంగాజలకేళిఁ దేలి దివిలో నే కల్పకచ్ఛాయనో
మదనారాధనఁ జేయువేళ సుమి మామా యిష్టసంసిద్ధి క
య్యదనున్ సైత మతిక్రమించెడిని జా శౌనేని యుంతంపటన్
దుని హాహ్యాళికి నైన నందుకొనఁజాలదున్ దోడిస్వఃకాంతలన్.

లీలాతాండవ వాపయిన్ జరుగు హాళిన్ దివ్యలావణ్య వ
స్త్రాలంకారధగద్ధగప్రభల దేహాచ్ఛాదనల్ గాఁగ ద
ద్వేళాభంగిమ భంగికాప్రకటనన్ దేవర్షి బ్రహ్మర్షులే
పోలం జొచ్చెద రీ ఘృతాచి ప్రధమస్తాత్రార్హతత్రీడలన్

నరలోకమ్మునకున్ సుదుర్లభము స్వర్ణస్వప్నరూపమ్ము మా
సురలోకమ్ము సుఖమ్ము నిన్ వెదకుకొంచున్ వచ్చియున్ వెన్కకున్
మరలింపంబడుచుండె నేమి నరజన్మం బెట్టి భోగిత్వమే
తెలిఁ గైపోయిన దెంతగా నగునో దేవేంద్రుఁ డీ ధిక్కృతిన్.

నీవు గృహస్థుఁ డౌ తెలియఁగ నేరఁడొ భంగముకాదా దేవతా
స్త్రీవిషయమ్మునన్ బరసతీవిముఖవ్రత మిందుఁ డంపె నా
జ్ఞావిధి వచ్చియున్నయది సన్నిధి నిష్ట మెలర్పకుండినన్
బోవును పాపమార్గ్రహము పూనకు మేమనుచుంటిలక్ష్మణా!

ఈవు ఘృతాచి వైన మఱి యెవ్వతెవేని పిశాచి వైన నా
త్రోవల నొక్కటే యనృతశిల్పము౯ సహింపఁబోవ ని౯
దేవవిభుండు పంచు చెలి దిక్కులతో దివి నున్నవాఁడెకో యా
రావణుచేత లంకను చెఱం బడియుండదె? కటే మృషాకృతీ.

దివిదార్క౯ బనిలేదు పో భువిని ప్రాదేశమ్ము మాత్రమ్ము నీ
వవలం బోయెదె నే ననుజ్ఞ యిడ కాహా! యింగితజ్ఞానశూ
న్యవు నీ కాటయెగాక యెంత యవమానప్రాప్తినిం జేయుచుం
టివి యయ్యింద్రునిగూడ చేర ననుకొంటే నిన్ను నీపారము౯.

నిర్యత్నంబుగ వింటి పైకపుగుచుండె౯ జేయి యాశ్చర్య మా
శ్చర్యం బంత సమాధి భంగ మయి యజ్ఞధ్వంసినీతాటకా
చర్యాలాపన బుద్ధి కేర్పడియె నిస్సందేహ మీ వేవొ దు
ష్కార్యాలోచనయా నిశాచరివి స్వర్గస్త్రీవె దుర్భాషిణీ.

క్షిరజిహ్వాసహితంబుగాఁగ వికృతాకారం బెదో కంటి సుం
దరగా నాడునె నిర్నిమిత్తముగ సంధానమ్ము గావింతునే౯
శరము౯ జాపముకట్టె యొకఁ-నీ ముసాన౯ గాసుహాసమ్ముతో
నౌఅగట౯ నీనిజరూప మప్పటను బాహాబ౯ దాటక౯ బోలుచు౯.

జీవధనమ్ము దక్షిణవది స్త్రీవగుట౯ వధియింపఁ జుమ్ము నీ
త్రోవను బొమ్ము నీదు కలరూ పెటిఁగించుక రాకుమీ కుటీ
రావరణమ్ముచాయఁ గల నైనను గాని సహింప వింక నా
యీవిలు నమ్ము లేను సహియించిన పిక౯ నరమాంసభక్షిణీ.

నిక్కపు దేవకాంతవలెనే కనుపట్టెనె కామరూప మా
రక్కసియా యిదే ఋషిపరంపర నిత్య మెఱుంగఁ జెప్పు నా
మ్రుక్కడియయ్యెనేఁ గడుమహాసముతండ్రి' యదేమిరూపమా
ముక్కో కదూలమే యదియ మూలమొకో నరవాహనంగొనన్

ఆశ్రమభూములందు ఋషులాడెడుమాటయుమాటగూడదూ
రశ్రవణమ్ముఁ జేసి యిది రాక్షసజాతి కెఱుంగఁ దెల్పు నా
విశ్రవసుండు దీని కిడె విద్యను దాని నొరుం డెఱుంగఁ డ
న్యాశ్రయ మింక నీయసురులందున లేనటులన్ విధించుటన్.

పాపిష్ఠురాల కానా
యాపన్నంబలెనె యేదొ యాడఁగనుంటే
యీపగిది నెందఱెందఱి
నాపొట్టం బెట్టుకొంటి నన్యాయముగన్.

ఏ దురుపద్రవక్రియకొ యే నిటు వచ్చినదాన గాను మీ
పాదములాన! మీరలు స్వభావముగాగనె దేవతాప్రియుల్
గాఁదఱుచున్ వినంబడును గాఁక సురాంగనవేష మూనితిన్
గా దన నాకుమాత్ర మిది కావలెనే కరుణింపఁగావలెన్.

ఆబృందారకకోటి సర్వమును మా యంతఃపురీదాసదా
సీబృందం బిఁక నందులోపలి కుప్పుతాచీ దేవదాస్యాకృతిన్
నేఁ బూనన్ మది నెంతొ సిగ్గలతి కాని నీవు గుర్తించి నా
కీబాధన్ దొలఁగించివైచితివి నీవే యీ మనోదేహముల్.

నీచెలిమిన్ గడింప హావణించుక వచ్చిన నాఘృతాచిపా
త్రోచిత మైనభావ ముపయోగ మొనర్చెడిపట్ల సర్వమి
థ్యాచరణం బొనర్చితి దయామయు లీర తెఱుంగ లేరె పై
పై చెఱలాడు ప్రేమ కిఁకెఁ బాపము పుణ్యమటన్న శంకయే.

తోడన్ వచ్చి ఫలంబు తేనె కొనితెత్తున్ లేర చేదోడు వా
దోడై యూర్మిళ యూడిపడ్డ దనిపింతున్ జూడరా నన్ గృపం
జూడన్ గావలెగాని యెంత యయినన్ జూపించి సంసారపుం
జాడన్ మాటికి నొక్క క్రొత్తరుచి నాస్వాదింపఁగాఁ జేతురా

నరమాంసాశన మింతతో విడుతురా నావైప మం చెంతురా
చరణం బంటి వచింతురా యొడలిపంచప్రాణముల్ నీవెరా
పరిచర్యావర మీయరా వలపు నిల్పన్ శక్యమే గాదురా
కరుణం బోలవురా యొకించుకయినం గానీ తపోధ్యానముల్.

మాయన్న యిడిన నా మాణిక్య గృహమున
నో మోహనా! మన ముదమింక
దాచుకొందుమర శుద్ధాంతంబునన్ నిను
సౌందర్యమధుకలశంబ రమ్ము
విహారణమ్మునకైన వెడల నీయను జామా
ఒంటిగా నే వెనువెంట లేక
పోకుండదు లేరె యీశూర్పణఖానోగ
లీలామయుండవై లిప్తలిప్త

